శ్రీమత్పరదేవతాయైనమః

స్నేహలతా కవితాసంఘ పుష్పము 34.

# హంసతారావళి
# &
# లలితా శతకము

గ్రంథకర్త :

విద్వాన్ యస్. విశ్వనాథశాస్త్రి, ఎం. ఏ.,



[ వెల 0-4-0.

శ్రీమత్పరదేవతాయైనమః

# అంకితము.

ఉ. హంసయె యాదికారణము
హంసయె లోపలినుండు శక్తియుం
హంసయె మూర్తిమూలమగు
హంసయె దేహము నిల్పు స్వాత్మయుం
హంసయనన్ బరాత్పరుఁడె
హంసయె యంటి యంకితంబు నా
హంసకె కేలుమోడ్చి యిదె
తద్యోడు శ్రేయము పారలౌకికిం.

opinion

by Andhra Sahitya Chakravarti

# Dr. Chilakamarti Lakshminarasimham,

*Telugu Poet, Dramatist and Novelist.*

**RAJAHMUNDRY.**

——:o:——

I have heard with great pleasure many verses on different topics composed by Vidwan S. Viswanadha Sastry M. A. Professor, Nizam College, Hyderabad, Deccan.

His poetry is very sweet with noble ideas and deep emotions and his style is lucid and flowing. The Madras University, in appreciation of his scolarship in Oriental Languages, appointed him to deliver four lectures on Telugu Literature which he did with great ability to the entire satisfaction of not only the Madras University but also of the whole telugu public.

I believe that he has a great future before him and will do much valuable service to the cause of Telugu and Sanskrit Literatures which is so much needed at present.

He is a double M. A., both in English and Sanskrit and passed the Vidwan Examination in Telugu and hence there is a combination of three cultures in him which is a very rare qualification. He will be a very valuable acquisition to any University in India.

I wish him every success in life.

Rajahmundry,
26-4-'34. } C. L. Narasimham.

*opinion*

**BY KAVISARVABHOWMA**

## Sreepada Kristnamurty Sastry Garu,

**RAJAHMUNDRY.**

---

విద్వాన్ సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారు, ఎం. ఏ.,

నైజాం కాలేజి పండితులు.

---

ఆర్యా !

మీరు రచించిన హంసతారావళి - లలితాశతకమును సావధానముగాఁ జదివితిని. మీకవిత్వము నాతికఠినమ్మృదు మధురము. మీపద్యములు మీపాండిత్యమును మీలోకజ్ఞతను వెల్లడించుచున్నయవి. "మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్" ఇట్లు మనోహరముగాఁ గవిత్వము చెప్పువారిక్కాలమున నరుదు. మీ రింగ్లీషువిద్య నభ్యసించినవారలయ్యు నిట్లు సంస్కృతాంధ్రసాహిత్య మలవఱచుకొని నిర్దుష్టకవిత్వ మభ్యసించుట మీపుణ్యపరిపాకమని తలంచుచు మీ కెన్నో ధన్యవాదము లొసంగుచున్నాఁడను.

రాజమహేంద్రవరము,
1—4—'34.

కవిసార్వభౌమ
శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

*opinion*

## BY SATAVADHANI

# Chellapilla Venkatasastry Garu,

### KADIAM.

---

శ్రీమత్పరదేవతాయైనమః

బ్రహ్మశ్రీ విద్వాన్ నరిపల్లె విశ్వనాథశాస్త్రి, ఎం. ఏ., నైజాం కాలేజిపండితులు రచించిన **1.** హంసతారావళి, **2.** లలితాశతకము. ఈరెండును సావధానముగాఁ జదివినాఁడను. చక్కని ధార, సలక్షణమైన రచన లోనగు సుగుణములు గలిగి జనరంజకమై యున్నవి.

ఈయనకు భగవంతుఁడు ఇతోఽధికమైన గ్రంథరచనాప్రోత్సాహ మొసంగి యాయురారోగ్యముల ననుగ్రహించి లోకోపకారకుఁ డగుఁగాతమని యాశీర్వదించుచున్నాఁడను.

కడియము,
తూ॥ గో॥ జిల్లా
**14-3-'34.**

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని.

---

# తొలిపలుకు

——:o:——

ఈ హంసతారావళి, లలితాశతకము బ్రహ్మశ్రీ విద్వాన్ సరిపల్లె విశ్వనాధశాస్త్రి, ఎం. ఏ., గారిచే రచింపఁబడినవి. ఇందు " లలితాశతకము " వ్రాయుటకుఁగల హేతువులు కొన్ని పాఠకమహాశయులకుఁ జెప్పవలసియున్నవి. ఈ విశ్వనాధశాస్త్రిగారు వయసునఁ జిన్నవారలయ్యు, బుద్ధిప్రతిభావిశేషమున బృహస్పతులని చెప్పుట సత్యదూరము కాదని మా నిశ్చితాభిప్రాయము. వీరు చిన్నప్పటినుండియు విశేష శ్రమలకులోనై సంస్కృతాంధ్రాంగ్ల విద్యలయం దుత్తమ పరీక్షలయం దారితేరి, యసమాన పాండిత్యమును సంపాదించు కొనిన వారలని యీనాఁడు వీరధిష్ఠించిన యున్నతోద్యోగ పదవియే చెప్పక చెప్పెడిని. దయాసత్యములు, భక్తిజ్ఞాన వైరాగ్యములు, యోగాభ్యాసము, కర్మనిష్ఠ, పరోపకారము, శమదమాది సద్గుణనికరంబులు నుగ్గుపాలనాఁటనుండియు వీరి కభ్యాసములు. వేయేల? జ్ఞానసోపానముపైననే వీరిజీవిత చారిత్రము కట్టఁబడియున్నదని వీరి యాకృతినిఁబట్టియుఁ గృతులను బట్టియు నిర్ణయింపవచ్చును. వీరి జీవితము మానవకోటి కాదర్శప్రాయము. ఇట్టి మహనీయు లొకనాఁడు శ్రీ జటప్రోలు సంస్థానమున, కొల్లాపురమున మాచే స్థాపింపఁబడిన

"స్నేహలతాకవితా సంఘము"ను జూడవచ్చిరి. ప్రథమ సం
దర్శనభాగ్యముననే మాపై వారికి నిర్వ్యాజకరుణాకటాక్ష
ద్యుతులు సంపూర్ణముగఁ బ్రసరించినంత-

ఉ. మిత్రులఁ జేర్చినావు కవిమిత్రులడెందము హత్తినావు స
త్పుత్రులఁ గాంచినావు సతిఁ బూతచరిత్రను జేసినావు సు
క్షేత్రములందుఁ గావ్యలత గీతము బాడఁగఁ బెంచినావు నీ
చిత్రమదేమొ తెల్పఁగదె చిత్తము పొంగెడు మిత్రసత్తమా!

అను పద్యము ప్రవేశమూల్యముగ నిచ్చి మా సంఘ
మం దొకసభ్యుఁడుగఁ జేరుటయును సంభవించె. ఇట్టి మహా
త్ములు సంఘసభ్యులని చెప్పినచోఁ దక్కుంగల సంఘవిశేషము
లన్నియుఁ జదువరు లూహింపందగు.

మా సంఘమునందు లేఖలన్నియు లేఖ్యరూపముగ
నుండునటుల వెలువడు నాచారమైయుండె. ఈసందర్భమున
నేదో యొకలేఖ యందు "లలితా రమ్మిఁక కాలయాపనము లేలా?
రాజబింబాననా!" యను మకుటముతో నాలుగైదు పద్య
ములు వ్రాసి పంపిరి. అందుపైన నీపాదమునే ప్రధానముగాఁ
దీసికొని నూఱుపర్యాయములైనను నోరూర నోరార మన
'లలిత'ను బిలువరాదా యనియు దాని పరదేవతాసేవ భాషా
రూపమున నందు సరసమగు కవితాధారతోఁ జరుగు ననియు
నేతద్భక్తివిషయంబు లట్లుండ నేకప్రాసతో రచించిన శతక

మాంధ్రవాఙ్మయమునఁ గొంతప్రౌఢతసూచించుననియు, శతక మంతయు మత్తేభమయమై నియమబద్ధమై విరాజిల్లుననియు, మనకవితాసంఘమునకిది నవీన కుసుమరాజియగు ననియుఁ గవితాకాంతకు నూతనాలంకారమగుననియు భాషాప్రపంచ మున రమణీయముగ వెలుంగుననియుఁ బ్రోత్సహించినంతమాత్ర మున 'మిత్రలేఖలు' ప్రోయఁగరానివని నిశ్చయించి, మాయం దుంగల తాత్పర్యముతో నిట్లు సమాధానము వ్రాసిరి.

ఉ. చిన్నతనంబునందె గనఁజెల్లెను బాలయుపాసనంబు నేఁ
గన్నది నేఁడుగాదు చనఁగల్గెను ముప్పదివత్సరంబు లా
పన్నమహోదధుల్ గడచెఁ బట్టినపాదము పీడనైతి నీ
పిన్నది యౌవనోన్మద వివేకవిశారద సుబ్బరాయఁడా.

ఉ. మేదినిఁ బెక్కుతీర్థములు మెట్టితిఁ గాశిప్రయాగలందు నా
గాదిలి చిట్టితల్లి వెదకన్ గననయ్యెను బెక్కుమాపులన్
గాదని పట్టుఁబట్టి చని కాంచితిఁ దెచ్చితి శీతశైల గం
గోదకగాహితన్ బదరి నుత్కటసంయమి లోకసేవితన్.

శా. ఏనాఁ డిందిర నాదు హృత్కమల మధ్యేందిందిరాభంబునై
నానాసూనవితాన వాసనల నానందాబ్ధి నోలాడనో
యానాఁడే పలుపోకలన్ దనరె నన్యాపేక్ష లేనట్లు వి
జ్ఞానోత్ఫుల్లముఖారవిందరమతో సర్వోన్నత శ్రీలతోన్.

సీ. అక్షరరూపిణివై సరస్వతివంచు
నలరించు నొకసారి యంబుజాక్షి
శక్తిస్వరూపిణి శర్వాణి తానంచుఁ
జరియించు నొకవేళ చంద్రవదన
కరివరదుని కాంత కమలాలయ నటంచుఁ
గరుణించు నొకపరి కంబుకంఠి
నిత్యకామేశ్వరి నిరతాన్నపూర్ణవై
నేమించు నొకమారు నీలవేణి

గీ. విమల విజ్ఞానముఁ గూర్చు విద్రుమోష్ఠి
పూర్ణ సత్త్వంబు నెలకొల్పు పులినజఘన
శుభములొడఁగూర్పు నేప్రొద్దు శోభనాంగి
రూఢి సద్భక్తి నిడి ప్రోచు రుచిరదేహ.

ఇట్లనుక్షణ మంతఃకరణప్రవృత్తులంబట్టి రసానుగుణం బుగ వేషము మార్చుచుఁ దత్తదవయవ విస్ఫూర్తియు నంగ విక్షేపంబులు నింపెసలార మనోరంగమున రేవగలు నాట్య మాడుచు నొండు రెండు పూర్వపుణ్యార్జిత విజ్ఞానాక్షరంబు లీ భౌతికదేహంబున నెలకొల్పి యాభారతికిఁ జిన్నెలువన్నెలు గై సేసి, కవితారూపంబున గద్యపద్యంబుల నాచేననిపించు నా పరదేవత నెంతగ వినుతించినఁ దనివితీరు ? భావాతీతంబగు రూపరసానుభోగ్యముల కాలవాలంబగు నాయమ వర్ణనాతీతం

బైయుండ నేవాకులా నిగమార్థంబును సుబోధంబుఁ జేయఁ
జాలు ?

అచ్ఛపుభక్తి, హృత్పంకజోత్తమసింహాసనస్థం గావించి
ధ్యానించి బ్రహ్మానందముం బడయఁగలమేగాని యిట్టిదని
వర్ణింప నేరితరము?

ఉ. శాంతము కొంతయుండవలె స్వాస్థ్యముడెందముఁ జెందఁ
గాంచి యే

కాంతము జేఁబడన్ వలయు ఖండితమై విషయంబుఁగావలెన్
జింతయొకింతదూరమయి శ్రీపరదేవికటాక్షమాలికా
సంతతిఁబర్వియుండఁ గనఁజాలిన నే శతకంబువ్రాయుదున్.

శా. ప్రారంభించినసాధనాకలన దివ్యాశీస్సులన్ గాంచినన్
సారోదారమనింద్యకావ్యసుమమాసంభార ముప్పొంగినన్
ధారాశుద్ధియొకింతయున్ బ్రతిభయాధ్యత్వంబు నిండారినన్
జేరన్ జాలుదు నీదుకోర్కెతుదినేఁ జెల్లింతు నీకట్నమున్.

ఈరీతిగ శ్రీశాస్త్రిగారు వ్రాసిన పైనియమములకు
తోడు అక్షరవర్గ నియమమునుగూడ పాటించి నెల తిరుగక
ముందె శతకమును బూర్తిచేసి స్వయముగ కొల్లాపురమునకు
వచ్చి మాసంఘమున కర్పించిరి.

ఏతద్విషయంబులన్నియు గమనించు పాఠకమహా
శయులు దీనినిఁబట్టి మిత్రులన నెవరో, మిత్రధర్మమన నెట్టిదె

నివ్వటిల్లునో గ్రహింతురు గాక. మా కవితాసంఘమునకు "మిత్రలేఖలే" జీవనాధారములని వేఱుగఁ జెప్పనక్కరలేదు.

ఈగ్రంథ మీ కట్టుబాటులతో రచింపఁబడినదని చెప్పుట కింతగా వ్రాయవలసివచ్చినది. మహామహులగు పండిత కవులచేఁ బ్రశంసింపఁబడిన యీగ్రంథప్రాశస్త్యమును దత్కవితానైపుణ్యమును విస్తరింప బనిలేదని యింతటితో విరమించుచున్నారము.

ఇంత లోకఖ్యాతి నార్జించిన శ్రీ శాస్త్రిగారి గ్రంథమునకుఁ దొలిపలుకు వ్రాయుభాగ్యము మాకు లభ్యమైనందులకు నెంతయు శ్రీ శాస్త్రిగారియెడఁ గృతజ్ఞులము. పరదేవీ కృపాకటాక్షమున మాకుంగల మిత్రబాంధవ్యము దినదినాభివృద్ధియగుఁ గాతమని ప్రార్థనా ప్రకటనము.

లోకమున నాంధ్రభాషాసేవ విరివిగఁ బ్రతియాంధ్రుఁడు జేయుటకుఁ బాటుపడుగాక. సంపూర్ణకవితా జయపతాకము నెలకొల్పుటకు పండితులు, కవులు, భాషానిలయములు, గ్రంథాలయములు, పత్రికలు, సంఘములు, వారిలోవారలకుండువ్యక్తిగతవైరములు మాని యేకమనస్కులై యన్యోన్యానురాగబద్ధులైన నాఁ డవకాశమేర్పడునని యాంధ్రలోక

మెఱుంగుఁగాక. అనాఁడే యాంధ్రభాషావధూటి నిండుకళ లతో ప్రతియాంధ్రుని హృదయమునఁ దాండవమాడు ననుట ప్రత్యేకముగ వ్రాయనేటికి ?

పురాకృతపుణ్యవశమున, బహుజన్మసుకృత తపఃఫల మున లభించిన కవిత్వమును నిట్టులే భగవత్పరముగ ననేకకృతు లను రచించుపట్ల సార్థకము జేయుచుఁ గవితాలోకమునకుఁ బరోపకారము సేయుటకు భగవానుఁడు శ్రీ శాస్త్రిగారికి సంపూర్ణాయురారోగ్య శ్రీల నిచ్చి సంరక్షించుఁగాత.

కవితారసాస్వాదననిపుణు లిట్టి భగవదర్పితంబులగు కావ్యములయందుం గల రసమును గ్రోలి పరమభక్తులై ధన్యులై కృతార్థులగుదురని నమ్ముచున్నారము.

ఇట్లు బుధజనవిధేయులు,

పి. రామసుబ్బారాయుఁడు - వేంకటనారాయణు,

( సోదరకవులు )

అధ్యక్షులు,

స్నేహలతాకవితాసంఘము.

కొల్లాపురం,
శ్రీజటప్రోలు సంస్థానం,
1—5—'34.

శ్రీమత్పరదేవతాయైనమః

# హంసతారావళి

## ఉత్పలమాలికలు.

శ్రీనిలయంబునన్నతము చిత్తమురంజిల సర్వసౌఖ్యముల్
దీనులదుఃఖముల్గనక తీరికగాననుభోగ్యమాయె; నా
కానని వానిసామ్యముగఁ గన్నులుగల్గియు లేనివాయె; నో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

శ్రీనగజామనోధవుని చెన్నగు పాదయుగంబు నెమ్మదిన్
బూను నిరంతరంబిచటఁ బుట్టుచుఁ జచ్చుచునుండు దైన్యమున్
మానుపఁజాలు మంత్రమదె మాటికి నమ్మకముంచఁగావలెన్
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

కానఁగ లోకవృత్తములు కాయము నిక్కమటంచు నుందురే
కాని పరంబుగానరు; సృగాలములంబలెఁ బోరుటేల; మా
జానకిరామునిం గొలువఁ జాలఁగ సౌఖ్యములందఁ జేయు; నో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

తేనెల గన్నిరుంబువులఁ దీరగురూపముఁగాంచి నే తదీ
యానన భాగ్యపుం జవుల నానక చూచుచునుండ నేర్తు నా ?
యీ నెపు కోర్కెలన్మునిఁగి యొంతయుఁ దేలెదనంచు సందువో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

ఊనక వీసమున్నిసువు నోపిక నీదగుచేతలన్నియున్
ధ్యానమునందు గాంచుమటన్యాయము నీహృదిగోచరించెడిన్
నేనయి తీవరించినది నేరమదొక్కటి చూపుమందువో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బొద్దుగ్రుంకెడిన్.

నీ నయమింకఁజాలు విననేరను; కాలము చెల్లిపోయెడిన్
వీనుల విందుగాశ్రుత విన్చినరూఢి పురాణబోధలన్
గానుక పెట్టిచూచితిని గాదనిబొంకితి త్రోసిపుచ్చితో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బొద్దుగ్రుంకెడిన్.

జ్ఞానము నిశ్చయంబు గనఁజాలనియప్పుడె, గాఢరాగ మిం
తేనియు మాయలేనపుడె; యింద్రియలౌల్యము తగ్గనప్పుడే
పూనిక నీదుమార్గమును బోల్చితి మాతయునౌనటన్న దో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బొద్దుగ్రుంకెడిన్.

మానవునీదుబుద్ధి విను మాసములబ్దములెన్నియే న్జనెన్
మేనులు పెంచువాంఛలను మేపఁగఁజూచితి వంతెకాని నీ
దీనత తీరిపోయినదె ? తెల్పుము సన్నిటుఁ ద్రిప్పనెంచితో ?
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బొద్దుగ్రుంకెడిన్.

నేనయి వంత మేర్పడఁగ నిక్కపుమార్గముఁ బట్టిపోవఁగన్
బూనితిఁబిన్ననాఁడె ; కనఁబోవను శాక్యపుశాస్త్రపంక్తులే
నానితి శ్రోత్రపేయముగ నాత్మవివేకసుధార్ద్రసూక్తులన్
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బొద్దుగ్రుంకెడిన్.

మేనతి కార్శ్యమున్బొరసె మీరిన దాహముతీవరించె, నీ
కానలవెంబడి న్దిరుగఁ గాళులు మిక్కిలికందిపోయె, నో
హా! ననుబాధవెట్టఁగన నోర్చినదెల్లను విస్మరించితే ?
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

దీనతనున్న కాలమునఁ దియ్యనిమాటల బుజ్జగించి నా
యూనల మీరకుండి ముగు దాయని పించుక లొంగియున్నచో
నీనయగారజాలనటు నిక్కము చిక్కుదునంచు నెంచకో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

జేనెఁడుపొట్టకై వెదకి చిక్కినయిల్లిలుఁ ద్రిప్పి వేసి తొ
రా! నిను నేమనందగును రాగతనంబున ; బాల్యమాట నే
జానకిరాముగొల్తుననఁ జక్కనియాసల మోసపుచ్చితో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

ఐనదియంతయున్దెలియ నైతిన ! బాలుఁడనాటనొండు ; స
మ్మానము జేయఁగాఁదగిన మాతృనిదేశము వేఱొకండునై
నానియమంపుఁ బల్మియది నాటకమైనది యెంచిచూడుమో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

పోనియుమంచునాదద్రిఢిమ పూర్ణతఁజెందినదేయటంచు లో
కానుభవంబుఁగొంతయిన నబ్బునటంచును నీకు నే సమా
ధానముఁజెప్పివచ్చితిని తాల్మివహింపవె గర్వమేటికే
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

ఊనకు మీనమేషగణ నోత్సుక మాంద్యము; పూజ్యభావ మిం
తైనను నుండఁబోదు ; విను మూలము మానము జవ్వనంబు వా
గానము ధీవివేచనము గల్గదు దేహికి నంగపుష్టి యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

స్నానము జేయఁగాంచితివి చక్కనిజీవసుధాస్రవంతులన్
గానమువీనులానినవి కాంతగిరీంద్ర దరీముఖంబులన్
దీనత వోఁ గనుల్గనెను దివ్యహిమాలయ శేఖరంబు లో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

మానముఁగావఁ గావలె ; సమానబుధావళిగౌరవంబు జే
నూనఁగయత్నమందవలె ; నున్నతిదీనులఁ గావఁగావలెన్ ;
బూనిక దేహికిట్లయినఁ బుట్టుకధన్యతఁ గాంచుఁగాదె యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

ఆ నగరాజమార్గముల నంతవిలాసవిభూషితంబు లా
కాననపాళులెన్న ఫలగౌరవ సంపదకాశ్రయంబు లా
యానటనోత్తరంగిణులు నచ్యుత శీతలశీకరంబు లో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

ఏనరుజీవనంబుఁగని యెల్లరు మోదమునందఁగాంతురో
ఏనరుకార్యసంపద యథేచ్ఛగ దీనులఁగావఁ జాలునో
ఏనరుమందిరంబు వివరింపగ నర్థుల పారిజాతమో
వానిచరిత్రజాతముల భాస్వరసూక్తులదృష్టియుంచి యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

ఏనరు మానసంబుగతి యింతయుహింసల పొంతఁబోవదో
ఏనరునార్జనంబు తనియించునొ యాశ్రితకోటిమాన సం
జేని గుణోన్నతి న్సుజను లెల్లపుడు న్నుతియింపఁ జాతురో
వానిచరిత్రజాతముల భాస్వరసూక్తులదృష్టియుంచి యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

చానరొ! నీదుపోకడలు సాగవు ; నమ్మఁగరాదునిన్ను ; స్వా
ధీనమునందె యుండఁగని ధీరతదైన్యముఁ గప్పిపుచ్చి సం
ధానముఁ జేయఁజూచెదవు తథ్య మసారముఁ ద్రోసివైచి యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

మానవతీలలామ యవమానము పొల్పడి యోర్చియుండు టే
మానము? లోకమాన్యుల యమానుష సాధన సంపదున్నతిన్
బూనిన నాఁటినీగరిమ ముచ్చటకైనను జూడఁగల్గునో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

న్యూనతలేని జీవనము యోగముబూనినఁ గాంచవచ్చు ; స్వ
స్థానమునందెనిల్చి సుమజాతముతావులఁ జిమ్మఁగాంచియే
మానవు శీర్షమందొ, వనమధ్యమునందొ విశీర్ణమైనటుల్
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిన్.

స్నానముఁ జేయలేదనను; సంధ్యఁదలంపను ; పూజలొల్ల; వి
జ్ఞానముపొంతఁబొమ్మనను; శాస్త్రముఁజూడఁగఁబోరుపెట్ట; నా

దానవు సౌరభమ్ముకలదానవు కీర్తిసుమంబవమ్మ యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిఁ.

ఆనతిఁబెట్టలేదు ; నతి యంటెని నిన్బ్రీతిమాలితెంతయుఁ
మానితి నిత్యదీక్ష నినునమ్మితిఁ జెప్పినదెల్ల సేసితిఁ
సానలదీరె రత్నమని సౌఖ్యములిచ్చినఁ గన్నుఁగాన నో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిఁ.

ఏనిఁకనున్నకాలమిటు లే జననీయను ; నిద్రమాని యే
మైననగుఁ నిరాకరణ యంత్రము మీటఁగనిశ్చయించి తీ
పై నెటులేగెదో కనెదఁ? బంతము చెల్లునెనాఁడు? రమ్మ యో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిఁ.

పోనని యొట్టుఁబెట్టుకొని బొంకితి వాళకు మేరలేదు నీ
మానముఁ గాచికొమ్ము బ్రతిమాలెదు రోజులు చెల్లిపోయె నీ
యానము ధ్యానగోచరము నంబరమార్గము మీరముట్టు మో
మానసరాజహంస చనుమా వినువాకకుఁ బ్రొద్దుగ్రుంకెడిఁ.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీలలితామహాత్రిపురసుందర్యైనమః

# లలితాశతకము

మత్తేభములు.

అలవోకన్నను నే నుతింప మనమం దాశించి చేరంగని
స్తులమౌ తొల్లిఁటిపల్కులే గ్గనని యస్తోకప్రభాభాస్వర
జ్వలనస్తోమముఁగాంచునే జనుఁడు నా సత్వంబనంబోక శ్రీ
లలితా! రమ్మిఁక కాలయాపనములేలా ? రాజబింబాననా! 1

అలరుం దావులు వ్యాప్తమైనగతి విద్యాగంధవాహంబు భా
సిలు చందంబున నక్షరంబగు యశశ్శ్రీసౌమ్యకర్పూరకాం
తిలతాజ్యోతులువెల్గ చాడ్పునగదే ధ్యేయంబు నీచాయలో
లలితా! రమ్మిఁక కాలయాపనములేలా? రాజబింబాననా! 2

అలుగన్ హేతువులెవ్వియున్ విమలవిద్యారాజమార్గంబులన్
గలయన్ గాంచని చిత్తమందెటుల శంకల్గాంచు సుస్థానమున్
దలఁపేఁ జేకొని నిల్వరించితిని సంతాపంబులేదందు నో
లలితా! రమ్మిఁక కాలయాపనములేలా? రాజబింబాననా! 3

అలికంబందున నక్షిఁగొన్న హరు నర్ధాంగంబుఁ గైకొంచు నీ
యలవున్ జూపుచు శక్తివై సురసమూహంబెల్లఁ గొల్వంగ ని
చ్చలు లోకంబున నన్నపూర్ణవయి యుత్సాహంబుఁ జేకూర్పవో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 4

అలకల్ కమ్మని మోముఁ దమ్మిపయి నృత్యంబాడఁగా నిద్దఁపున్
మొలకల్ దేరెడు హాసచంద్రికలు కెమ్మోవిన్ బ్రభల్ జిమ్మఁగా
జలదశ్రీఁ గను శౌరివక్షము నజస్రంబత్తి శ్రీలీయ నో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా! రాజబింబాననా! 5

అలరుం దమ్మిన జన్మమంది నిరతధ్యానంబునన్ దత్త్వమున్
దెలియన్ గాంచిన నల్వనాల్కతుది నిర్నిద్రప్రభావోన్నతిన్
బలుకుం దొయ్యలివై సుధాకలితకావ్యశ్రేణి మాకీయ నా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 6

ఇల నీమూర్తులలీలలే హృదయమం దెవ్వేళ ధ్యానింతునే
ని, లసద్రూపము లక్ష్యతేజమయి నా నేత్రద్వయంబాఁగనే
ని, లలిన్నా రసనాగ్రమందు నిలువన్ నీరేజపత్రేక్షణా!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 7

ఇలువేల్పన్నను నాదిశక్తియన సర్వేశస్థచిచ్ఛక్తి నా
వెలిలో వ్యక్తుల జీవకాంతియన దేవీవాచ్యతత్త్వంబులన్
గల రూపాశ్రితదివ్యకృత్యముల సంస్కారంబు నీవే గదా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 8

ఊలుకందిచ్చెద ముప్పిరిన్నొలసి నా యూహాతరంగోద్ధతిన్
బెలుచన్ దీరముఁ జేరి సూత్రితమునై విజ్ఞానతారళ్యమై
తలుకుల్ మీరు సువర్ణకీలితము ముక్తాహారమున్ బ్రీతినై
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 9

ఊలుకింతేనియు లేదు నీకటిమ నా యుల్లంబు బంధించె నీ
పలుకే బంగరమైన కాలమిది నా భాగ్యంబుచేఁ జెల్లె ని
క్కలికిన్ లోకము నీకృతిన్ వినిన నిష్కాలుష్యమై కాలిలు నో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 10

ఎలరారుంగదె శాంభవీమహిమ తెంపే దివ్యకృత్యంబులన్
వెలయున్ నీదగుశక్తిగాదె యదివినా విశ్వంబు రూపేది? ఈ
శుల యర్ధాంగమవై గుణత్రియముచే శోభిల్లె దీ సృష్టిలో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 11

ఎలమిన్ నీవ దశావతారముల నందేఁ గార్యనిర్ణీతివై
పొలుపుంగాంతువు రామకృష్ణుల గుణుల్ భోగంబు నీపాలు తెం
కలు రూపొందుభవాబ్ధిపోతములు లోకప్రాప్త జీవాళిమా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 12

ఎలసెన్ దానవతామసాంశములు మదిన్మానె యుపేక్షించు స
న్యుల నేమంచుచు బ్రార్థనల్ సలిపి కందన్ముక్తిమార్గంబు? నా
తలనే వ్రాసెనె భక్తిమైఁ బిలచి నీ తారుణ్యమున్ గాంచనా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 13

ఒలయన్ విద్యుదఖండశుభ్రరుచి సత్స్ఫోటోద్ధూతభావాబ్ధిపై
మలయన్ నిర్మలదృష్టిపాతములు సంభావించు పుష్పాలిపై
నిలువన్ దావక పాదపద్మములు సందీప్తాచ్ఛహృత్పీఠిపై
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 14

కలువల్ పూచిన నూత్నయౌవనసుధా కాసారకాంతామణీ
విలసచ్చంచలతానురూపరసదృగ్విన్యాసలక్ష్మీయుతం
బులగున్ దావక సౌకుమార్యగరిమల్ మున్నట్లు పాసింపనా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 15

కలి నీసేవయె పావనంబు తొలి నీ కారుణ్యమే రక్ష, స
త్కలగీతామృతవారిధారలగు నీతారుణ్య దృక్జ్యోత్స్నికల్
లలి నీకీర్తన మజ్జతాత్మునకుఁ గల్యాణంబు నేకూర్చఁగా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 16

కలనిక్వాణమొ హస్తిఘీంకృతియొ నిర్ఘాతప్రపాతంబొ ని
స్తులసింహప్రభుగర్జనంబొ యమరస్తోత్రప్రతిధ్వానమో
తెలియన్ జాలను నీదునాదము కృపాధీనుండ రాగాంధుఁడన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 17

కలితంబై దృఢకుండలిస్ఫురితషట్కంజాత సందీప్తమై
మలినధ్వాంతవిదూరమై నిశితమై మంత్రార్థసారంబునై
విలసిల్లున్ విమలాంతరంగతల మెవ్వేళన్ నివాసార్థమై
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 18

కులిశంబై చనునేది ఘోరతరరక్షోవీరశిక్షాక్రియన్
ఫలదంబై పొలుపొందునేది సురసంతర్పణంబు సంధింప నా
వెలిఁదమ్మిన్ గొనఁజూపు సాదరత నుర్విన్ నిల్పి ప్రోవంగ నో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 19

ఖిలులంచున్ గఠినాత్ములంచు దురితగ్రామాంత సంచారులం
చిల జన్మించుట యెంతొ పాపకృతియం చేప్రొద్దు నిందించినన్
ఫలముల్ సేకురఁజాలునే? కొలువ నిన్ శాపౌఘముల్ దూలవే
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 20

ఖిలమౌ భూస్థలి బీజముల్వడిన సుక్షేత్రంబెయౌఁగాక ని
ష్ఫలమై పోయెడు భాతి భారతి భవత్సంభావనల్గానకే
విలసిల్లంగనదందుచో నమృతమై విప్పారు జ్ఞానోక్తులో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 21

ఖిలమైనట్టి యనూనధర్మకథముల్ గీల్కొల్పి యోగంబునన్
బలురూపంబులు దాల్తు వేమనుచు నిన్ భావింపఁగా నేర్తు ని
స్తులతేజోఖని వాత్రియాకృతమహాస్తోత్రార్థదీప్తాత్మవో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 22

గిలుకు న్మట్టెలు గజ్జెలందెలును ముక్తిస్థాయికాలాపమై
మొలనూలున్ వరతారహారములు సమ్మోదంపుఁ దానంబులై
పలుఁగెంపున్ విడియంబుముంగరయు సంభావ్యస్వరంబుల్ గదా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 28

గిలుబాడందగు నామరూపముల నిక్షేపంపు సుస్థానముఁ
వెలఁబెట్టుందగు నందచందముల పెన్నిద్రాపుటాదర్శముఁ
బలుకుల్ మేలగు నాదబిందుకళల ప్రాగల్భ్యముల్ నీవె కా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 24

గెలువన్ జాలిరి లోకపాలు రరిశక్తిజ్వాల నిన్నేరుటన్
దెలియన్ గాంచిరి సంయమీంద్రులు మహాతేజంబు నిన్ [గొల్చుటన్
నిలువన్ నేర్చిరి లోకులింత యిలపై నీప్రాపునన్నించుటన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 25

గెలువన్ శక్యమె వైష్ణవీమహిమ నిన్ గీర్తించి సేవింపకే
యలమూర్తిత్రయమున్ విమోహమున నత్యంతంబు బద్ధాశులై
చెలికారంబున మన్ననల్ సలిపి నిన్నేపట్టి కామించిరో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 26

చలపత్రంబటు చంచలంబయిన మాసంధానయోగంపు దృ
ష్టులు నిల్వన్ గనలేక మాయయయనుచున్ శుష్కప్రియాలాపముల్
బలుకన్ నేర్తుము లోకమోహనము నీ భవ్యప్రభారూపమో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 27

చలమింకేటికి నిన్నుఁగాదనుచు నే సాధించు కార్యంబులున్
గలవే? చాలదె శోధనంబు కనుమా కారుణ్యమే పారఁగాఁ
దెలియన్ జాలుట కెంతవాఁడను సదా తీర్థంబు నీపాదమో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 28

చలదిందీవరషండమండితసుధాసారోదకశ్రీలచేఁ
గలహంసాదివిహంగసౌమ్యవిరుతోద్గానశ్రుతిశ్రీలచేఁ
దులకించన్ దివి శ్యామసుందరసభన్ దుర్గాదులున్గాఁవనో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 29

చిలుకల్ కోయిల తేంట్లు పండ్లుచివురుల్ చిప్పిల్లుపూఁదేనియల్
బులియన్ ద్రావుచు మెక్కుచున్ గెరలి నీ భోగ్యంపుగాధామృతం
బిలఁజిమ్మున్ మధుమాసయోగమిదె నాయింద్రాణి! రాజేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 30

చిలుకున్ విల్లును బాణమంకుశములన్ జేపట్టి యుద్ధావనిన్
బిలుకున్నార్చుగ నాసురీగణము దేవీ! కాలనృత్యంబులన్
సలుపన్ దివ్యులు సూనవృష్టిగురియన్ సాశ్చర్యరూపంబుతో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా 31

చిలుమంతన్ బ్రళయాంతరౌద్రగతి సృష్టింగాల్ప మిన్నంటి భీ
తిలి బ్రహ్మాదులు శర్వుఁ బ్రోవుమని యార్తిన్ గీర్తనల్ సల్ప న
ర్మిలి నీబంగరుతాల్మిబల్మి విసమున్ మింగంగ నీకొన్న నా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 32

చిలువాల్గాగళమందు చిల్కినటు విశ్వేశుండుఁదాల్పంగ నా
జ్వలనస్తోమములోని లోకములఁ గాల్పన్నిక శీతాంశుమా
లల మందాకిని నిర్మలోదకములన్ లాలించి రక్షింతువో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 38

చెలిమిన్ గాంతలు కోటికేల్ సతమునిన్ సేవింపఁగొల్వుండి యా
జ్ఞలు హంసాదులు ముఖ్యశక్తులు సదా సాగింప రాజేశ్వరీ!
కలితప్రిస్ఫురసింహపీఠిఁ బగను తౌత్రింబునన్ గ్రాలు నా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 34

చెలివన్నన్ గురువన్న సోదరవనన్ శేషించి చుట్టాలునా
గల బాంధవ్యములన్ని నీవయగుచున్ గల్పించి సంసారమీ
శులకే యీశ్వరివౌచు బంటువగుచున్ శోధింపఁ గ్రీడింతు వో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 35

చలిపైత్రి వలికొండమై చలువమై సారంపుగంగోర్మిలై
యలికాక్షిన్ బ్రిలయాగ్నికీలముల నా హాలాహలజ్వాల రో
చులశాంతింపఁగఁ జేయు నీ చలువఁ గాచున్ గాదె త్రైలోక్యమో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 36

చులుకన్ జూడఁగ న్యాయమా పలుమరుల్ శోధింప సద్భావమా
నిలువన్ బెట్టి సుధర్మమధ్యమున నీ నిస్స్వామ్య నిర్భేద్య ని
శ్చలతత్త్వంబులఁ గట్టివైచి కృతముల్ సాధించుటల్ జాలవే
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 37

ఛలముల్ బన్నఁగ నీకు నేల మొఱకుల్ సాకౌత్కృతిన్ గనకం
ధులపోల్కిన్ బలుభేదభావముల నీ దుర్జ్ఞేయతత్త్వంపు బా
టలు గండోపలకంటకాన్వితము గాఢధ్వాంతమున్ జేతు రో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 38

జలదంబుల్ మధురాంబుపూరమటు భూచక్రప్రతాపార్తి వోఁ
వెలయన్ జీవలతావితానములు పుష్పించన్ గుజగ్రామ మ
మ్మలకంటెన్ దయ నన్నుమిచ్చి గనుదో మాతాన్నపూర్ణేశ్వరీ!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 39

జలజంబుల్ నగుమోము కన్గవ యురోజద్వంద్వమున్ గంఠము
జ్వలరేఖాంకిత పాదయుగ్మములుగా భావించి ధ్యానింతు నం
బ! లసత్కామితవస్తుకల్పలతికా! మాతాన్నపూర్ణేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 40

జలధిన్ శేషఫణీంద్రుపై పడగ పజ్జన్ యోగనిద్రావశున్
జలరూపంబున మేలుకొల్పి యురమున్ వాసంబుగాఁగోరి ని
ర్మలసాన్నిధ్యముబూని యిచ్చితివహో మాతాన్నపూర్ణేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 41

జలదధ్యానముతో వియత్పథమునన్ జైతన్య మాత్రశ్రీవై
బలులన్ శత్రులఁ దుంచుమార్గములు సంప్రార్థించు దేవాళికిన్
బలమింతే న్నిగులంగనిత్తుమనఁగన్ మాతాన్నపూర్ణేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 42

జిలుఁగుంగానుచుజిల్గువస్త్రములునున్ జైత్ర్యైన వక్త్రంబునన్
జిలుఁగున్ నవ్వెలయన్ జిలుంగునడలన్ శీతాంశుసుశ్రీలతో
జ్వలనప్రావృతమండలాంతరమునన్ సర్వాంగషప్రజ్ఞతో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 43

తలపున్ స్వర్గము మన్ను మిన్ను నొకటన్ దహ్యంబుగా నిండి నీ
బల తేజంబులె వ్యాప్తమై తనరెడిన్ భండాసురోన్మూలినీ!
సిలుగుల్ బాపి శుభంబుఁ గూర్పఁ దగవే శ్రీరాజరాజేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 44

తలమే ధాతకు ధాతతాతకు హరేంద్రస్వర్గభానుస్థ వా
సులకేన్నిన్నువినా ప్రభుత్వములు నస్తోకప్రభాదీప్తమై
జెలఁగన్ మాపరదేవతా! భగవతీ! శ్రీరాజరాజేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 45

తలిరుంబోణులు శ్యామలాదులును వ్యక్తావ్యక్తరూపంబులన్
జెలువై సేవకులై క్రియాచతురలై సేవించి క్రీడింతు రా
చెలికారంబునఁ జూడరాదె? బగళా? శ్రీరాజరాజేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 46

తలిరున్ విల్తుని మోహనాకృతులు చిత్రింబందు కావ్యంబులన్
వెలయింపన్ బహు నవ్విసుందరి? భవద్విఖ్యాతలీలాకృతుల్
చెలఁగున్ వ్యాపిని! మిత్రరూపిణి! రతీ! శ్రీరాజరాజేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 47

తలిరుంబ్రాయము మానసాంబుజము సంధ్యానాట్యవిన్యాస శో
భలఁ దెల్పన్ బ్రథశయ్యమై కఠినమై భాసిల్లు లాస్యంబు ని
స్తులమౌ తాండవనృత్యభేదముల కెందున్ దుల్యయోగంబునన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 48

త్రిలఁతుఁ నామగతఁ షడానన నజఁ దాశత్రియోన్స్మాలి ని
న్నలసామంబులై యాశుదప్రికరమై యాధర్వణోచ్చాలితం
బులగుఁ దైత్యకులాంతకప్రచుర సర్వోపాయసంధాయినీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా ? రాజబింబాననా! 49

త్రిలకింపఁ బరమాణువై మహితమై దిగ్భ్రాంతబ్రహ్మాండమై
చెలఁగఁ దావకచిత్కలాప్రతతి సుస్థిత్రిస్వరూపాత్మికా!
చెలిమిఁ జేరితి చక్రరాజనివసచ్ఛ్రీ రాజరాజేశ్వరీ!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా ? రాజబింబాననా! 50

తెలియఁ దగ్గ విశేషముల్ శ్రుత నిర్దిష్టంబు పుణ్యాకృతిన్
దలమీఱం దగునిశ్చితప్రియము నిత్యశ్రేయదంబై విరా
జిలు నీ చందము జీవితంబు వెలయఁ శ్రీనామ కామేశ్వరీ!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 51

తెలిదీవిఁ సితపక్షపూర్ణశశికాంతిన్ దుగ్ధవారాశి ను
జ్జ్వలముక్తారుచికల్పభూజముల శ్రీవఁ గొల్వ సన్నించి యా
వల సుబ్రహ్మణితీర్థపాదముతినంబా ? శ్రీపరాదేవతా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 52

తెలియఁ గావలె దివ్యగీతముల సందిగ్ధార్థమంత్రంబు నాఁ
గలబుగ్గీతము లే యజుస్సులమరెఁ గల్యాణకృన్మార్గముల్
సులభప్రక్రియ వెల్లడించుక్రియలన్ శోభిల్లు దంతస్థవై
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 53

తిలకించన్ దిలకప్రరోచిశశికాంతుల్గ్రాల మోముల్ కరం
బులు నాల్గై పదివేలనంతమగుచున్ బూరించి బ్రహ్మాండమే
చి, లలిన్ భక్తులఁగాతువమ్మ దయతో శ్రీకామకామేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా!54

తొలిదీవిన్ జనియించి తత్త్వమసియన్ దుర్జ్ఞేయసూత్రార్థ మం
జులభావోన్నతిఁ జూడఁగల్గి విమలజ్యోత్స్నాంబుధిన్మగ్ని నీ
బలముం దెల్పిన దత్తసూర్యగురులన్ భావింతు నీ వాఁడనో
లలితా! రమ్మిఁకఁ కాలయాపనము లేలా? రాజబింబాననా! 55

తొలిమిన్కుల్బలె వేల్పుగిడ్డి వలదా? మున్గ్రియామాత్ర రూ
పులు వేల్గ్ధనమే ప్రయోజనములా? పోల్కన్ వృథావ్యక్తు ల
న్యలు త్వత్తేజమె కామితప్రదము మాయంబా! పరాదేవతా!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 56

తొలిజన్మంబున నీదుపాదములె సంతుష్టాంతరంగుండనై
కొలువన్ జాలఁగ లేదె యెల్లపుడు సంకోచంబు లేకుండ మే
ల్తలఁపుల్ నీమహనీయమూర్తినిడి నాధ్యైవంబుగాఁ జూడనే
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా ? రాజబింబాననా!57

తొలువేల్పుల్ మదయుక్తులై సుగతులన్ దూషించి క్రూరక్రియా
కలుషంబూని తిరస్కరించి జని సాక్షాత్కారమున్ ధన్యులై
రలధిక్కారములింపా? భక్తి వెగటా? యంబా పరాదేవతా!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 58

త్రోలికట్టుల్ నలుమోములై నలువ నీదోర్వీర్యచారిత్రముల్
కలఋగ్గీతములన్ బ్రశాంతఫణితిన్ గల్పించెఁ గావ్యప్రథల్
బిలువన్బ్రానితి ఋగ్గతార్థముల నో వేదాంతసిద్ధాంతికా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 59

దలిమంబై వర యోగసాధనల నుత్సాహక్రియాశక్తు ల
గ్గలమై సూక్ష్మసుషుమ్నమార్గమున నక్షయ్యంబు గుప్తప్రభా
కలితంబౌ ప్రభుశక్తి నిత్తు వమలా! కాత్యాయినీ! మోహినీ!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 60

దళితంబై చను రోగముల్ విమలదృక్ శ్రీకటాక్షప్రభా
నిలముల్ వీచిన రాలుసూనములటుల్ నిర్వాణసంధాయినీ!
కులకుండాలయ! కౌలమార్గనిరతా! గోప్త్రీ! సహస్రాక్షి! మా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 61

నలఁగెన్ హేమావనపుష్పదామ మనుసంధానక్రియల్ భారమై
తలఁగెన్ సంభృతపూర్ణసారగరిమల్ దాల్పన్ వ్రితౌన్నత్యముల్
తెలియున్ సర్వముపేక్ష సేయ నయమా! దేహేంద్రియాధీశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 62

నలదంబానిన చేటికన్నియల యానందప్రశాంతోక్తులై
కలగీతంబులు ఝంకృతుల్ వెలయు నో కాళీ! మృడానీ! సతీ!
యలవంగా యటులేటె మదోస్తదవిశాలాక్షీ! తవారాధనల్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా!

నలువై భర్మవికారమై రతనముల్ నాడెంపు మేల్రవ్వ భూ
షలు కంఠంబున దాల్చి గోపురములన్ స్వర్గామతుల్యంబులౌ
నిలయంబుల్ గని నాఁడు మందిరమునన్ నిల్వన్ బరాకేటికే!
లలితా! రక్షింపక కాలయాపనము లేలా? రాజబింబాననా! 64

నిలువన్ లేదని వేత్రిహస్తులను సాన్నిధ్యంబునన్ నిత్యమున్
బలుసంబారములన్ బ్రసాదములు సంపాదించి యీనంచునో
పలుకన్నానితి? హృత్పుటంబు చిలికెన్ భక్తిస్ఫురందంబునో
లలితా! రక్షింపక కాలయాపనము లేలా? రాజబింబాననా! 65

నిలువెల్లన్ విమతుందిలంబులడరున్ నీ మందిర ప్రాంగణం
బులు పూజారులు భాగ్యవంతులకె సంపూర్ణంబుగా దాసులై
యులపున్ దీర్తురు నీకు ముద్రిలిడుదున్ హాస్యాస్పదంబౌగదే
లలితా! రక్షింపక కాలయాపనము లేలా? రాజబింబాననా! 66

నిలువన్ జాలరు బీదసాదలటు మందీభూతచేతస్కులై
కలవారల్ తెలియంగ లేరు నిను సంజ్ఞామాత్రిపీఠేశ్వరిన్
ఛలమా మందిర మేల స్వాత్మవిమలస్థానంబు నీ కిత్తునా
లలితా! రక్షింపక కాలయాపనము లేలా? రాజబింబాననా! 67

నిలువన్ బల్కినదోఁ జనన్ జనులకున్ నిక్కంపుసఖ్యంబు లీ
గలుగుంగాఁ గలసర్వమున్ గృతము నీకై వశ్యమున్ జేయని
ష్ఫలమేనా నజితా! శివంకరి! సహస్రాక్షి! యనంతా! జితా!
లలితా! రక్షింపక కాలయాపనము లేలా? రాజబింబాననా! 68

నెలవంకన్ బదివేలుకోటులినులున్ నీముందు నిల్వంగ ది
వ్వెలు విద్యుద్ఘనదీపకాంతిదరి నీ వీర్యప్రభావోన్నతుల్
గలఁచున్ గ్రూరుల శత్రులన్ గెలచు భక్తశ్రేణి కాత్యాయనీ!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 69

నెలవంక ల్బదివేలు శీర్షములకున్ నీ రాజనంబీయ నీ
నులవిండ్రై ఘనసామముల్ సెలఁగ బంధూకప్రసూనంపు మా
లల మేల్కట్టులశోభ లింపడరఁ గల్యాణస్వరూపంబుతో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 70

నెలవున్నన్నన సేయకుంటఁదగవా నిష్పందసుశ్యామ శీ
తలమందాకిని చెంత మంచుమల రాత్ర్యర్థంబు నన్యుక్త కే
శ లతాజాల కృతాంబరంబున మహాసారంబునన్ గాలివే
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 71

పలుకం బాఱిన కండ్లు శాఖనెటు నిల్వంజాలు వృత్తంబులో
త్తలి ముక్తస్థితినందు నాఫణితి నైంద్రీ! భద్రకాళీ! పరా!
మలముల్ దూల్చితి నిన్నె నమ్మిఁ మది నీ మంత్రంబె కీలించితిన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 72

పలితప్రాయము కర్మబంధనము సంపర్కంబు పోనాడి జ్ఞా
నలవిత్రింబున సాక్షియున్ బ్రతియునై నానావిభేదంబులన్
వెలిఁబెట్టన్ గను శుభ్రచిత్కళల నుర్విన్ జక్రరాజేశ్వరీ!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 73

పలలంబంటిన నీరమూహ్ప్రగతి నీ భాండస్థమాలిన్యముల్
సలిలజ్ఞానము శుద్ధిచేయు నదికాంచన్ బూర్వపుణ్యంబునన్
గలదే చింతకృతంబులంతయులఁతే కల్యాణకామేశ్వరీ !
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 74

పలుకన్ నేర్చినదాది నిందిరియము లభ్యాసాతిరేకంబునన్
కలికీ ! నీ వరనామకీర్తనసుధాకల్లోలినీభంగచం
చలడోలాంతరసన్నివేశములఁ గాంచన్ లేద ? యాశ్శోభనా !
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 75

పలుముల్ గావివి నిత్యకృత్యముల నొప్పన్ నీదుసర్వజ్ఞతా
కలనన్గాంచుమ సత్యభాషణములన్ గల్పించి మర్త్యుండు ని
న్నలరింపన్ గలఁడే పురాణ జననీ! ప్రాణేశ్వరీ! ప్రాణదా!
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 76

పలువల్పన్ దరహాసచంద్రికలు బర్వన్ వీణ వాయించుచున్
గలకంఠస్వనతుల్యసుస్వరమునన్ గానంబు సంధించుచున్
నిలువన్ మామకమానసాంబరమునన్ నిత్యప్రశాంతోజ్వలా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 77

పులి గాకుల్ దరిఁజేర నీదుకవచమ్మున్ గూర్చి రేయుం బవ
ళ్లులు రక్షించెదు నీకటాక్షమొటుగల్గున్ విస్తరింపంగ ని
ర్మల కీర్తిద్యుతి కోటిభానుసదృశా! రాజత్కృపారాజ్యదా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 78

పొలతీ ! డెందము నీదునామసుధ నెప్డున్ వీడ నేఁగాంచితే
పొలయుత్కైకనను స్వప్నవార్తకద పొల్పున్ గాంచఁగానెంచినీ
చలముల్ జూపఁగ నెన్నిమార్లు వితమై చన్నన్ బరాకేటికే?
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా! రాజబింబాననా! 79

ఫలితంబు ల్విరితీవకన్నియలకున్ వర్ధిల్ల శాఖాభుజం
బుల నందిచ్చెడు భాతి నీవఖిలభూస్వర్వాసజంతూత్కరం
బులకున్ షోడశవర్ణశోభితమహాభూజంబవై ప్రోతువో
లలితా ! రమ్మిఁక కాలయాపనము లేలా రాజబింబాననా ! 80

ఫలముల్ జూడఁగ జాతకంబిడిన దైవజ్ఞుల్ నవాంశంబులం
గలయంగూడిన యుచ్చనీచదశలన్ గన్పట్టు భావిక్రియల్
దెలుపన్ దూలును మోదఖేదముల నీదిగ్భ్రాంతులన్ గావనో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా! రాజబింబాననా! 81

బలశాలుల్ బలమంచు ధీయుతులు సంభావించు ధీశక్తి నా
తలిరుంబోణుల శీలవహ్నియనఁగన్ ధైర్యంబనన్ పేరసూ
క్తుల మౌనీంద్ర తపోబలంబనఁగ నీ దుర్జ్ఞేయతత్త్వంబునా
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 82

బలముల్ రూపము విద్యయున్ నయము నిర్వక్రక్రియాసక్తియున్
చలముల్ భక్తియు విశ్వభావనము విశ్వాసంబు నుత్సాహముల్
గులముల్ ధర్మము ప్రాభవంబులగు నీ గుప్తార్థనామంబులో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 83

బలిపుష్టంబుల దీర్ఘజీవనము నోర్వంజాలి నిర్భాగ్యతన్
బాలియన్ జాలక యోగసాధనవిధిన్ భూరివ్రతాంతాగ్నులన్
నిలుపున్ బ్రాణము కీటకం బెవఁడిలన్ నీ ధ్యానమున్ మాని యో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 84

బలవంతుల్ గురువంబునన్ మఱచి యాపద్బాంధవీ సత్త్వమున్
దలవంపుల్ గన సాధుసత్త్వములకున్ దాపంబుఁ జేకూర్చు విం
తలు యత్నంబులు సల్పజాతురలఁ తుల్ దర్పఘ్న తాహంకృతిన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 85

బలులంగూర్తురు జీవహింసవలదన్ భావంబువో నాడి ని
ర్మల శాంతాసిలతావిదారితమదోన్మత్తారిషడ్వర్గమే
బలియాయ న్గనలేరు హృత్పుటమనో పాదంబులన్ వ్రాల్తురో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 86

బలవంతంబుగ భక్తిపాశముల నిర్బంధించి నిన్గట్టఁగా
వలెనా? క్రొత్తలె యట్టిమార్గములు నీ భాగ్యంబు సన్నెట్టనా
యులనాఁ డన్నవిధంబు సత్యమని నీయాంతర్యమే తెల్పదే
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 87

బలిమిన్ గట్టఁగఁబూతమూనఁ గదటే వశ్యంబు నీకౌనె! మం
జులవాగ్వైఖరి కూర్మిరతన్ బొరయు నాశుద్ధాంతరంబొల్ల దు
జ్జ్వలతారావిధుమండలాంతరరుచుల్ వ్యాపింపఁ బ్రాజ్ఞేశ్వరీ
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 88

మలినారంభము నా యెడన్ గనుదె సంభావించి రక్షింపవే
కలికాలంబని నా కనారతము లక్ష్యంబిచ్చి పోషింపవే
తల పూవాడకయుండ నన్నుఁగనుమా ధర్మంబుఁ జేపట్టఁగన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 89

మలలన్ రమ్యలతాగృహంబుల విరుల్ మందానిలోద్ధూతమై
కలయన్ రాలినసెజ్జ మేనడరనా కల్పింప నీరూపమున్
బులకల్ గ్రమ్మ ముదశ్రువుల్ దొలుక నాభోగంబవై క్రాలవే
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా ? రాజబింబాననా! 90

మలయుష్మేకోలుపుల్ గ్రహించు భవదున్మాదక్రియాకల్పముల్
వెలయున్ నేఁడు విరుద్ధమార్గముల నుర్విన్ హింసకాలంబవై
ప్రలయప్రేరితశర్మదశ్రుతులు సంభావింప ధీ చాలమిన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా ? రాజబింబాననా ! 91

మలుకారాతోలఁ గెన్ మహౌషధులు నింపన్ జాలె నల్దిక్కులం
బలరన్ గెంజివురున్ వికాసములు సంధ్యారాగ సోదర్యతల్
నిలుపన్ భవ్యకటాక్ష దృక్తటరుచుల్ నీకైన వాసంతమేన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా !92

లలనా! పాదములొత్తనిమ్ము ఘనమా లక్ష్యంబుఁ దూలించి ప్రు
చ్చిల నీ తేజము శీర్షమున్ బదములానింతున్ గదే కామినీ !
విలసత్కాంచనమేఖలాకటితటీవిన్యస్తహస్తాంగుళీ !
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా ? రాజబింబాననా!

లలితంబుల్ బదిమార్లు దెల్పనగునే లావణ్య గేహేందిరా!
లలిఁగాంచన్ జిరశోధితప్రచురలీలాహృద్యవీణాసుతం
త్రిలుమీటన్ దెలియంగనోఁగదవె నిర్దుష్టంపురాగోన్నతుల్
లలితా! రమ్మిఁక కాలయాపనములేలా? రాజబింబాననా!

వలపుందీవలు హృద్వివంచినదరున్ బల్కించు నీకన్న న
న్యులకున్ శక్యమె? యుగ్గుపాలఁగలిగెన్ యుష్మత్సకాశంబు నీ
చెలిమిన్ దామహతింబలెన్ స్వయముగాఁ జెల్వారుసుస్వానమో
లలితా! రమ్మిఁక కాలయాపనములేలా? రాజబింబాననా!

వలభిం శర్వరి హంసతూలికలతల్పంబందు నిద్రించి ని
చ్చలు భాగ్యోన్నతిఁదూగఁగాంచి నినుమెచ్చన్ స్తోత్రముల్
[ సేయువే
రలఁతుల్ బట్టరు ముక్తిసూత్రములు నిత్యశ్రీలు నీపాదముల్
లలితా! రమ్మిఁక కాలయాపనము వేలా? రాజబింబాననా!

వెలివాఁడంచును ముట్టరాదనుచు నిర్వీర్యప్రవాదంబు లి
మ్ముల నుండంగని నమ్మియంతరము నిర్ముక్తస్థితిం గూల్చు ర
మ్మా! లతాతన్వి! కృశోదరీ! శివకరీ! మాతంగకన్యా! యుమా!
లలితా! రమ్మిఁక కాలయాపనములేలా? రాజబింబాననా! 97

వెలితిప్పన్ నను వెల్లమావనగ వేవెల్గన్న రేవెల్గు నా
వెలిగారు న్వెలి గుల్లయున్ నరపదా వెల్మ్రాకులున్ జెల్లునా
వెలివాఁడన్ బుుతమైన సత్యగతులై విద్యాధరీ సేవితా
లలితా! రమ్మిఁక కాలయాపనము వేలా? రాజబింబాననా! 98

శలభంబుల్ దనహహ్నికీలముల నాశాబద్ధమై మ్రిగ్గుటల్
పలుజీవంబులు క్షుద్రముల్ బలులకై వశ్యంబులై చచ్చుటల్
దలఁపన్ జాలఁడు బద్ధుఁడైనరుఁడు నిన్ ధ్యానించివ్యక్తుండగున్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 99

శలకంబుల్వలయూకృతిన్ గనమనోజ్ఞంబైన వాసంబుఁబ
న్న, లలిన్ మక్షికజాతమందుఁబడి యందున్నాశమత్యంత మ
ట్లిలపై జ్ఞానియు కర్మబంధములచే నీల్గున్ నినుంజేరఁడో
లలితా! రమ్మిక కాలయాపనము లేలా? రాజబింబాననా! 100

సలికంబైన యసారమైన కృతముల్ స్థానంబుహృత్పీఠమై
సొలపుల్ గాంచిన యంతరంగమలయున్ శోధింపు నిజ్జేరితిన్
తిలకంబై పెనుగొండలా కలుషముల్ దిక్కై దిశాంతించునో
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 101

నెలగొమ్మల్ పదివేలుసాగి పొలుచున్ స్నిగ్ధంబు సారంబునా
జలమున్ స్కంధముగ్రోలిపాదములఁ బంచన్ జాలుపర్యంతమున్
కలికీ స్కంధము నీవె శాఖవితరుల్ కల్పింత్రు పూజావిధుల్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 102

హాలముం జేకొని భూమిదున్నినను బద్ధార్థిన్ బుభుక్షార్తిమై
యిల భిక్షాటన సేసిరన్ సుతులకై యింతన్ ధనోన్మత్తు లం
ధులసేవించిన నెగ్గలేదు పరిశుద్ధుండౌను నీ కీర్తనన్
లలితా! రమ్మిఁక కాలయాపనము లేలా? రాజబింబాననా! 103

# తప్పొప్పుల పట్టిక.

## హంసతారావళి.

| పేజి | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 3 | 1 | 3 | వెట్టుఁగన | వెట్టుకన |
| 6 | 2 | 3 | గానవో | గానవో |

## లలితాశతకం.

| పేజి | పద్యం | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 2 | 1 | వ్యాప్త్మైన | వ్యాప్తమైన |
| ,, | 3 | 1 | అలఖ్ | అలగ్ |
| 3 | 1 | 1 | ఉలుపందిచ్చెద | ఉలుపంచిచ్చెద |
| 6 | 4 | 2 | గనలెక | గనలేక |
| 7 | 4 | 3 | తాల్రి | తాలి |
| 10 | 5 | 2 | బ్రిధళీవ్య | సుమళీవ్య |
| 11 | 1 | 2 | యాశుద | యాశుగ |
| ,, | 4 | 2 | మించియా | మించినా |
| 12 | 3 | 2 | లా ! పొల్రి | లా పొల్రి |
| ,, | 5 | 2 | ని | ని |
| 13 | 5 | 3 | యులపంగా | యులపంగా |
| 14 | 8 | 3 | దుఱ | దుర్ |
| 15 | 1 | 3 | గెలము | చెలము |
| ,, | 5 | 2 | బ్రితము | వ్రితము |

| పేజి | | పద్యం | | పంక్తి | | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 16 | ... | 1 | ... | 3 | ... | కల్యాణ | కల్యాణి |
| ,, | ... | 5 | ... | 1 | ... | పులిగాకుల్ | పులుగాకుల్ |
| 18 | ... | 3 | ... | 3 | ... | హృత్పుటమనో | హత్పుటమునీ |
| ,, | ... | 3 | ... | 3 | ... | వాఁగ్రిల్లురో | వాఁగ్రిల్లునో |
| ,, | ... | 4 | ... | 3 | ... | తెల్పెదే | తెల్పదే |
| 19 | ... | 3 | ... | 1 | ... | మేత్ర | మైత్ర |
| 20 | ... | 3 | ... | 1 | ... | వలభిం | వలభిత్ |
| ,, | ... | 5 | ... | 1 | ... | తిప్పఞనను | తిప్పన్నను |
| 21 | ... | 1 | ... | 3 | ... | వ్యక్తం | ముక్తం |
| ,, | ... | 4 | ... | 3 | ... | వితరుల్ | లితరుల్ |
| | | | | | | కల్పింతుౖ | కల్పింతు |